# మిణుగురు పురుగు

"మిణుగురు పురుగుని చూసి
వింత పడ్డాను.
వింత కాంతులు నీవి
విచిత్రపు పురుగా!"

పేకుమళ్ల కామేశ్వరరావు

నవ్యసాహిత్యపరిషత్తు
గుంటూరు

వెల:
రెండు అణాలు

# తొ లి మా ట

కవితకూ ఆనందమే పరమప్రయోజనం— మానవుడు చేసే ప్రతిపనికీ ప్రయోజనమే గనక. కాని, సాధారణ మానవునికి కవిత్వమనటంతోనే గజిబిజిగా అల్లిన పద్యాలూ, పాషాణాల వంటి సమాసాలూ—అంతాగందరగోళమై పోతుంది—అతని మనస్సు. చిన్నతనంలో బలవంతంగా అతనికి నేర్పబడిన సంస్కృత శ్లోకాలు, భాగవతపు పద్యాలు మళ్లీ ఒక్కమారు అతనికి జ్ఞాపకం వస్తే, చిన్న తనంలో బడిపంతులు బెత్తం పుచ్చుకుని యమకింకరుని లా ఎదురు గుండా కూర్చుంటే తాను భయంతో గజగజ వణుకుతూ ఎన్నిసార్లు చదివినా జ్ఞాపకం వుండని ఆ అడవి పద్యాలు వప్పచెప్పడానికి, మణికట్లు తిరిగేసి కన్నీళ్లు తుడుచుకుంటూ నిలబడి నప్పటి దృశ్యం— అతని జీవితంలో మరచిపోడు.

ఆ దెబ్బలు తినడమూ—అది—ఆగోలంతా బడినించి బయట బడడంతోనే తీరిపోయిందను కుంటే—మళ్లీ యెందుకు?—హాయిగా బ్రతక్క !

మరి సాధారణ మానవుని కోసం కాదూ కవిత్వం ? అవునంటే అత డా ఆనందాన్ని అనుభ

వించే సాధనం చూపాలిగా ! ఐతే కవిత్వమే తనను అత డానందించడాని కనుపైన స్వరూపంలో అతని ఎదటికి పోవాలి.

ఐదారేడుల పసి మనసుమీద, సంస్కృత శ్లోకాలు గానూ, భాగవతపు పద్యాలుగానూ వెళ్లి పెద్ద బరువుగా పడితే అత డుక్కిరి బిక్కిరై బెదిరి పోడూ !

అప్పు డతని నల్లా బెదరగొట్టి తరువాత అతడు తన నాదరించడం లేదని నిందిస్తుంది—కవిత్వం, ఏం ప్రయోజనం ? పసితనంలోనే కవిత్వం అతనికి ఆనందాన్ని రుచిచూపడమారంభించివుంటే క్రమంగా అతని అభిరుచులను అభివృద్ధిచేసి అతనిని లోబరచు కొనేదే.

పసి వానికి తన తల్లీ తండ్రీ అన్నదమ్ములూ, అక్కచెల్లెళ్ల మధ్య వచ్చే చిట్టి సమస్యలను చక్కగా విడదీసి చెబుతూ, నిత్యమూ తన యింట్లో, తన పెరటి తోటలో, తను బడికి వచ్చే పోయే త్రోవలో తన కెప్పుడూ కనిపిస్తూ ముగ్ధుణ్ణి చేస్తూ వుండే దృశ్యాలను గూర్చి అతనికేమీ చెప్పదే—ఆకవిత్వం.

అతనికీ చిన్ని చిన్ని సమస్యలు వున్నై. వాటిని విడదీసి చక్కగా అతని కర్థ మయ్యేటట్లూ, అతని కానందం కలిగించేటట్లూ చెప్పాలి. అతని విజ్ఞానావరణాన్ని విశాలం చెయ్యాలి. అతనికి, తనచుట్టూను కనుపిస్తూన్న ప్రకృతినీ, తనలోని ప్రకృతినీ తెలుసుకొని ఆనందించడం నేర్పాలి.

అందుకు బాలులకు ప్రత్యేక సాహిత్యం కావాలి. అదే లేదు—మనకు.

అనుశ్రుతంగా వస్తూవున్న గేయాలు కొన్ని వున్నై. "కాళ్లగజ్జ" "వొప్పులకుప్పా" లాంటివి. కాని అవి చాలవు. పైగా అవి క్రమంగా నశించిపోతున్నై.

శ్రీ కామేశ్వరరావుగారు "పాలపిట్ట" అను గేయాల పుస్తకము ఇదివరకు ఒకటి ప్రకటించారు. ఇది రెండవది. ఆయనంటే ఆంధ్రదేశాని కిదివరకే బాగా తెలుసు.

ఆయన చక్కని కృషి చేశారు. బాలుర మనస్తత్త్వాలను పరిశీలించి దాని కనువయేటట్టు వ్రాయడం వారి ఆదర్శం.

"వాన వెలిసిపోయి", "పులి", "అంధకారం", "ఏనుగు", "మోటారుకారు", "రయిల్వే ఇంజన్" "ఎండమావులు" — వీటిని గురించి బాలుర లేత హృదయాలకు ఎలా చెప్పారో చిత్తగించండి. "వేకువ", "దిక్చక్రం", "మేఘం గొడుగు" మొదలైనవి చిన్నతనంలోనే మనం చదువుకొని వుంటే ప్రకృతి సౌందర్యాన్ని ఎంతగా ఆనందించ గలిగే వాళ్లం! "గాలికలచోటనే", "ఇంపు గుడిలో దేవుడి కంటే", "గొప్పకవి", "నేనే దేవుణ్ణయితేనా", మొదలైనవి ఎంతటి స్వతంత్ర భావాలు కలిగిస్తాయి!

పుస్తకంవిప్పి మొదట "విష్ణుక్రాంతపుప్పులు" అనే గేయం చదవడంతోటే నా కమితమైన ఆనందం వేసింది. చిన్నప్పుడు మా ద్వారకాతిరుమల ఊరు బయట పచ్చని బీళ్ల నిండా పుష్కలంగా పెరిగి నీలాల నింగిని ప్రతిబింబించే రత్నశకలాల వలె "విష్ణుక్రాంతలు" ఆనందంగా తలలూపుతుంటే ఎంతో ఆనందించేవాళ్ళం. అంతే కాదు. అది చూడ డంతో **Wordsworth** మహాకవి "**Daffodils**"

అనే గీతం శ్రీమతి సరోజనీ నాయడు **Golden Cassia** అనేపద్యం జ్ఞాపకం చేసినట్టయింది.

బాలుర విద్యావిధానాన్ని శాసించే పెద్ద లంతా వివేకంతో పరిశీలించి చూస్తే శ్రీకామేశ్వరరావు గారి కృషికి న్యాయం జరుగుతుంది.

ఏలూరు, 5—4—40.

బి. వి. సింగరాచార్య,
కార్యదర్శి,
సాహిత్య మండలి,

అంకితం

చిరంజీవులు విశాలాక్షులకు

## పని

సాయంత్రం సూర్యుడు
నాకంటే ఎత్తు లేడు,
అడిగాను, "ఆగండీ, ఒక్క క్షణం,
అట్లాగే పోదురుగాని."
ఎఱుపు కళ్ళ తోటి
ఉరిమి ఉరిమి చూశాడు,
"ఒక్క క్షణం ఆగితే
ఇక్కడి పని ఎవరు చేస్తార్!"

# పువ్వుల చెరువు

పువ్వుల చెరువుని నువ్వు
ఎప్పుడైనా చూశావా?
చెరువంతా అంతరతామర *
మరి నీటికి చోటే లేదు! 4
చిరు చేపలు ఉండే లేవు!
కరువలి వీచిన కదలును పూలే!

* తూటికాడ

# విష్ణుక్రాంత పువ్వులు

ఏ మహారాణి మెళ్లోదో

నీలాలపేరు ఇట

తెగి పడిపోయిందేమి !

కాదు – విష్ణుక్రాంత కడు చిన్ని పూలు. 4

తీగపై అడనడ తీరుగా ఉన్నై.

నీలాల కంటేను మేలుగా ఉన్నై.

# వే కు వ

తాటిచెట్టు మీది గూటిలో కాకి
వేకువ వేళని 'కావు కా' వంది.

మామిడి కొమ్మపై కూచున్న కోయిల
చుక్క పొడిచిందని 'కుహూ కుహూ' అంది.

గంపలో తొంగున్న నడికోడిపుంజు
పొద్దెక్కిపోయిందని 'కొక్కురో' అంది.

పూరింటి చూరులో పడుకున్న పిచ్చిక
తెల్లవారిం దని 'కిల కిల' మంది.

"లేవరా అబ్బాయి! లే నిద్రనుంచి."
"లేవవే చెల్లెలా! పోవాలి బడికి."

# ఏ ను గు

ఏనుగు వెంట పిల్లలు
ఎంతమంది పడ్డారో !
ఏనుగు వెంట కుక్కలు
ఎందు కలాగు అరవడం ?
ఇంత పెద్ద ఏనుగంటే
ఎంతో భయం నాకు !
ఏనుగుకి చెవులు
చేటలంత పెద్దవి !
ఏమీ ఎరగనట్టు పాపం
ఎత్తుతుంది తొండం !
ఏనుగు గంటల మోత
ఇంపు వినడాని కెంతో !
ఏనుగుమీది అంబారీలో
ఎప్పు డెక్కుతానో !

## ఊ రి కె ళు తు న్నా ను

ఊరికెళుతున్నాను, ఊరికెళుతున్నాను
జోరు రెండెడ్ల బండెక్కి ఊరికెళుతున్నాను.
గంటలఎడ్లు బండీ గబగబ లాగుతై.
పెట్టే బేడా, పరుపూ పట్టుకెళుతున్నాను.
చదివే బొక్కులన్నీ జాగ్రత్తగా ఇంట్లోదాచి
మేనమామల ఇంటికి నేను వెళుతున్నాను.
చదువులయ్యకి చెప్పు చదు వూరి కెళ్ళిందని!
తిరిగి వస్తే గిస్తే మరి బడికి వస్తానని!

# పాము

నాగన్న కథ లంటే
నాకెంతో ఇష్టం,
విన్నకొద్దీ భయం
వేసినా కూడా !

ఎన్నడూ నాగన్నా !
ఎదుట పడకోయ్ !
ఎందుకూ లేనిపోని
ఇబ్బంది మనకి.

* మా వాళ్ళూ మీ వాళ్ళూ
మునుపు ఒక్కళ్ళే!
పొత్తుగా పోదాము
ఇత్తరి కూడా.

* ఆంధ్రులు, నాగులు ఒకేజాతివారని చరిత్ర పరిశోధన.

# గా ఢా ం ధ కా ర ం !

కిల కిల లాడే పిట్టలు ఏవీ?
కల కల లాడే పువ్వులు ఏవీ?
గాఢాంధకారం!

మిల మిల లాడే ఆకులు ఏవీ?
గల గల లాడే పొలాలు ఏవీ?
గాఢాంధకారం!

జల జల పారే కాలువ లేవీ?
తెలి తెలి మబ్బుల మాలిక లేవీ?
గాఢాంధకారం!

తళ తళ లాడే చుక్కలె మనకు
బల బల తెల్లవారే వరకు.
గాఢాంధకారం!

# క బు రు  పం పిం చా ను

కబురు పంపించాను
కబురు పంపించాను,
కాకిచేత నేను - కబురు పంపించాను.
బడిలోకి వెళితే
పలకపుల్ల ఏదన్నాడు పంతులు.
పక్కవాణ్ణి అడిగితే
పలకే లేదన్నాడు తనకి.
బడి కింక రా నని
పంతులికి చెప్ప మని,
క్లాసులో పిల్లలతో
నే సహవాసం చెయ్య నని,
కబురు పంపించాను,
కబురు పంపించాను,
కాకిచేత నేను - కబురు పంపించాను.

## ఎండమావులు

ఎంత పెద్ద చెరువో! ఎన్నడూ చూడలేదు!
అక్కడంత చెరువుందని, ఎవ్వరూ చెప్పలేదు!
వట్టిచెరువే కాదు, వరద వచ్చిందమ్మా!
గడ్డివాములు ఎన్నో కదలిపోతున్నాయి.
గడ్డివాములు ఎన్నో కదలిపోవడంకాదు!
గడ్డి పడవలు కాబోలు ఒడ్డున ఉన్నై.
గట్టు నున్న చెట్లు కనబడుతున్నాయి నీటిలో!
చిన్న నీటి కెరటాలు ఎన్నెన్నో ఉన్నై.
ఇంత ఎండలోను ఎంతటి నీరమ్మా!

* * *

ఇక్కడ కనపడ్డ చెరు వేదీ!
ఇక్కడ ఉండిన వర దేదీ!
ఇక్కడ నిలిచిన నీ రేదీ!
నీరు కాదమ్మోయి!
ఎండ మావులు ఇవన్నీను!!



# గడ్డి పువ్వు

గడ్డిపువ్వుని చూసి గంతు లెయ్య గలవా?
పసరు గడ్డిలోన పిసరంత పువ్వుంది.
చిన్ని రెక్కలు ఐదు ఎఱ్ఱగా ఉన్నాయి.
ఎఱ్ఱ రెక్కలు కావు, కెంపు ముక్కలుగాని!
కెంపు రెక్కల మధ్య తెల్ల బొడ్డున్నాది.
తెల్ల బొడ్డు కాదు, తెల్ల వజ్రపు ముక్క!
కొమ్మ చివర పువ్వు కుదురుగా ఉంది.
గడ్డిపువ్వుని చూసి గంతు లెయ్య గలవా?

# మేఘం గొడుగు

ఎండకి కమలిన పువ్వుల్లారా!
మేఘం గొడుగు వస్తూంది. 2

ఎండకి వాడిన చెట్లల్లారా!
మేఘం గొడుగు వస్తూంది. 4

ఎండలో మాడే ఆవుల్లారా!
మేఘంగొడుగు వస్తూంది. 6

ఎండకి కాగిన చిన్న చెరువా!
మేఘం గొడుగు వస్తూంది. 8

# మి ణు గు రు పు రు గు లు

చిమ్మ చీకటి రాత్రి
చిన్న కాలువ మీద
మిణుగురు పురుగులు
ఆడుతున్నాయి.

మిణుగుర్ల వెలుగులు
కాలువ నీటిలో
కనపడుతున్నాయి.

ఒక్క మిణుగురైనా
కాలువ నీటిలో
మునగే లేదు.

కాంతులు లేవా,
కన్నులు లేవా,
కాలువ నీళ్లగపడుటకు!

# దిక్చక్రం

నిండు సున్నా మధ్య
నిలబడి ఉన్నాను.
సున్నా అంచున చెట్లు
ఎన్నెన్నో ఉన్నై.
సున్నా అంచుకి వెళ్లి
మిన్నందుకొంటాను.
మింటి మీదికి పాకే
మేఘ మాలికలను
సున్నా అంచుకి వెళ్లి
చూస్తాను తొంగి.
మింటి పైకి వచ్చే
సూర్య చంద్రులను

సున్నా అంచుకి వెళ్లి
చూస్తాను వంగి.
సున్నా అంచుకి వెళ్లి
తెస్తాను నేను 16
నక్షత్రాలని ఎన్నో.
అక్షరాలా నిజము!

# కోడి - పిల్లలు

కోడిపెట్ట నడుస్తూంటే
కోడి పిల్లలు వెంట వస్తున్నై.
కోడిపెట్ట కెక్కరిస్తే
కోడి పిల్లలు ఏరుకు తింటున్నై. 4

కోడిపెట్ట డేగ నీడని చూసి
'కొ-క్కొ-క్కో' అని రెక్కలు విప్పె.
కోడి పిల్లలు దాడున వచ్చి
రెక్కల కింద దాగినై. 8

# తొండా! తొండా!

"తొండా! తొండా! ఎందుకు
ఊగిస లాడుతున్నావు?"

"ఉండాలి మావాడు
కొంచెం దూరంలో."

"ఉంటే ఏం?"

"ఉన్నాడో, లేడో
తణిఖీ చేస్తున్నా."

"చేసి –"

"ఉంటే మీదికి వెళ్లి
నడుముని కరిచేస్తా."

" ఉండకూడదూ ? "

" ఈ తోట నాదీ; 12
అతనికి హక్కే లేదు. "

" తోట మాలికో ? "

" తోటమాలి కిక్కడ పనేమిటి;
మాటలు మీరుతున్నావు నువ్వు ! " 16

## చిలక - జామి పిందెలు

చిలక్కి జామిచెట్టంటే
ఎంత ఇష్టమో!
ముద్దు పలుకులు పలుకుతూ,
ముద్దుగా కొమ్మల మీంచి జారుతూ,
పిందెని తెంపి,
కిందికి వదిలేసింది.
ఇంకో పిందెని తెంపి,
కాలితో పట్టుకొని,
ఇంతేసి ముక్కలు చేసింది.
మరో పిందెని తెంపి,
తుర్రో తుర్రు.

# పి చ్చి వా డు

పిచ్చివాడి వెంట పడ్డారు పిల్లలు.
పిచ్చివాడి మీద విసిరారు రాళ్లు.
పిచ్చివాడు తిరగబడ్డాడు మీద.
పిల్లలంతా పడ్డా రొకళ్ల మీద ఒకళ్లు. 4

## నీ ళ్ల బిం దె లు

"అమ్మా! దొరువుకి వెళ్లి
తెమ్మన్నావా నీళ్లు?"
"ఉండు నేనూ వస్తా."
తల్లి బిందె తోటీ, 4
పిల్ల లక్కపిడత తోటీ
వెళ్లారు దొరువుకి.
బిందెని నీటితో నింపి
బుజాన్ని పెట్టింది తల్లి. 8
లక్క పిడతని నీటితో నింపి
బుజాన్ని పెట్టింది పిల్ల.
"ఇంటికి తెచ్చా మమ్మా మంచి నీళ్లు!"

# నేనే దేవుణ్ణయితేనా !

నేనే దేవుణ్ణయితేనా !
నిన్నిట్లా ఉండనిస్తానా !
రెక్కలు రెండు పెట్టించి
ఎగరనిస్తా పక్షులతో !
ఎగిరి వాలాలి కొండ కొసని !
ఎగిరి తగలాలి మేఘాల్ని !

నేనే దేవుణ్ణయితేనా !
నిన్నిట్లా ఉండనిస్తానా !
ఒంటిని పొలుసులు పెట్టించి
ఈదనిస్తా సముద్రంలో !
ఆడనిస్తా తిమింగిలాలతో !

# గొప్ప కవి

చాలా గొప్ప కవి అతడు
ఎలా అయ్యాడో !
చాలా చాలా రాశా డట !
చాలా చాలా పాడా డట !
ఎంతెంతో చదివా డట
అంత ఎలా చదివాడో !
ప్రకృతి అతని పుస్తక మట !
ప్రజలే అతని గ్రంథా లట !
అక్షరాలు లేని పుస్తకాలను
అతడు ఎలా చదువుతాడో !

# తాటాకు బొమ్మలు

నీటుగా, సాటిలేని
తాటాకు బొమ్మలు
చేశానంటోయ్ !
పెళ్ళికూతురు బొమ్మ !
పెళ్ళికొడుకు బొమ్మ !

బుగ్గని చుక్క
నుదుట తిలకం
కళ్ళకి కాటుక
మెళ్ళో పూసల పేర్లు
పమిటి పరికిణీ
పెళ్ళికూతురుకి.

బుగ్గని చుక్క
నుదుట గోపాలం
కళ్లకి కాటుక
మెళ్లో పూసల పేర్లు
పాగా, పంచ, కండువా
పెళ్లికొడుక్కి.

నీటుగా, సాటిలేని
తాటాకు బొమ్మలు
చేశానండోయ్!
పెళ్లికూతురు బొమ్మ!
పెళ్లికొడుకు బొమ్మ!
చూడండోయ్!

# ఏ ను గు కా ది ది ఎ ం జి న్

ఏనుగు కాదిది ఎంజిన్,
ఎంత వడిగా పోతుందో!
ఎనిమిది చక్రాలున్నాయి,
ఏనుగు లాగే నలుపు.
ఏనుగు కాదిది ఎంజిన్.
గడ్డి కాదిది తినేది,
కరిబొగ్గు, కట్టెలున్నా!
మంచినీళ్లు తాగుతుంది.
కైమని కీ పెడుతుంది.
ఏనుగు కాదిది ఎంజిన్.
మావటి కాడు నడిపేది!
డ్రైవరు దీనిని నడుపుతాడు
అలసట గిలసట లేనే లేదు.
ఏనుగు కాదిది ఎంజిన్!

# కా లా లు

వేసంకాలంలో ఎండకి
వేగి పోయాము !
వర్షా లెప్పుడు దిగుతాయో !

వర్షాకాలంలో వానకి 4
వణికి పోయాము !
చలిగా లెప్పుడు తిరుగుతుందో !

శీతాకాలంలో చలికి
బిగిసి పోయాము ! 8
ఎండలు ఎప్పుడు కాస్తాయో !

## గువ్వ పాట

ఎంత ఎఱ్ఱని పొద్దో!
క్రొ క్రొ - క్రో.

ఎంత చల్లని గాలో!
క్రొ క్రొ - క్రో.

ఎంత పచ్చని చేలో!
క్రొ క్రొ - క్రో.

ఎంత తియ్యని నీరో!
క్రొ క్రొ - క్రో.

ఎంత సొంపగు పూలో!
క్రొ క్రొ - క్రో.

ఎంత సొగసగు పిట్టలో !
క్రా క్రా - క్రో.

ఎంత ఇంపగు పాటలో!
క్రా క్రా - క్రో.

ఎంతో చక్కని దేశం.
క్రా క్రా - క్రో.

# మోటారు కారు

నిగ నిగ లాడే మోటారు కారుని
    ఎప్పుడైనా చూశావా ?
ఇంత చక్కని వింత రంగుని
    ఎవ్వరమ్మా వేశారు !

మోటారుకారు రేకులు కావవి
    మొహం చూసుకునే అద్దాలు !
కారు లోపల కుషనుల మీద
    కూచున్నామంటే హాయి !

తలుపు నొక్కితే పడిపోతుంది,
    చిలుక వెతికితే కనబడదు!

కళ్లు తెరిస్తే దిక్కుల దాకా
కాంతులు విరజిమ్మేస్తుంది !

జర్ జర్ మని కదిలిందంటే
జగములు దాటి పోతుంది !

ఇంత వింత మోటారు కారుని
ఎప్పుడైనా చూశావా ?

## బొమ్మలు

“ కత్తిరి ఎంతో బాగుందని
ఉత్తరీయం నాన్నది తెచ్చి
కత్తిరించానురా !
మా షోగ్గా తెగింది.
పిల్లిని, కుక్కని, చెట్టుని,
గొలుసుని, కత్తిరించానురా !
మా నాన్న వస్తూంటే
పారేశానురా.
చూశాడురా నాన్న
వీసె గుద్దులు నాలుగు
వీపు మీద పడేశాడురా.

చూడు కావలిస్తే
చొక్కా తీసి చూపిస్తా. ”

“ అయితే బొమ్మ లేవీ? ”

“ బొమ్మలు మా నాన్న
అమ్ముకుంటాడో ఏమో! ”

## పాలపిట్ట

పాలపిట్ట పాట పసందైన పాటా?
తురక ముష్టివాని గిలక కిర్రుపాట.

పాలపిట్ట ఆట పసందైన ఆటా?
తోడు లేని ఆట దొమ్మరి ఆట.

పాలపిట్ట బుద్ధి పసందైన బుద్ధా?
ఏడుపు ప్రీతి బుద్ధి ఏకాకి బుద్ధి

పాలపిట్ట బతుకు పసందైన బతుకా?
తాటిచెట్టు మీద ఒంటరి బతుకు

పాలపిట్ట గూట పసందైన పిల్ల
నీలి రెక్కల పిల్ల నిండైన పిల్ల

# వెలుగు

పెట్రోమాక్సు వెలుగు
విచిత్రపు వెలుగు.

గాసులైటు కాంతి
గమ్మత్తు కాంతి. ౪

విద్యుద్దీపం వెలుతురు
వింతైన వెలుతురు.

చంద్రబింబం వెన్నెలకు
సాటేదీ జగమందు. ౫

## వా న వె లి సి పో యి —

వాన వెలిసిపోయి వక ఝాము సేపయింది.
చెట్ల కొమ్మల నుంచి చిటపట రాలుతున్నై
చుక్కలు.
వాన వెలిసిపోయి వక ఝాము సేపయింది.
బాటపక్కనుంచి బలబల పారుతున్నై
నీళ్లు.
వాన వెలిసిపోయి వక ఝాము సేపయింది.
పూరింటిచూరులోంచిబొటబొట కారుతున్నై
బొట్లు.
వాన వెలిసిపోయి వక ఝాము సేపయింది.
దూరాన తోటలో తెల తెలగా ఉంది
వానపొగ. 19

# గాలివాన

గాలి వాన వెలిసింది
జడివాన తగ్గింది.
పంచ కింది కోళ్లు
బైటికి వచ్చాయి.
సాలలో గేదె
నేలపై గోరాడింది.
బాదం చెట్టు కింద
బాలురు చేరారు.
పడవలు కట్టి నీటిలో
బాలురు విడిచారు.
ఎగిరిన తాటాకుల్ని
పోగుచేసింది ముసలమ్మ.

# వే స వి

వేసవి వచ్చింది
వేములు పూశాయి,
మామిళ్లు కాచాయి,
మల్లెలు విచ్చాయి.
ఎండలు హెచ్చాయి,
ఏరులు ఎండాయి,
ఎండమావులు వచ్చాయి.
పడమటి కాంబరం * లో
కోయిల కూతల
చల్లదనాలు.

* గాడ్పు

# రెల్లు పూత

తెల్లని మేఘం గోదావరి
తీరాన్నెందుకు వాలింది?
దాహం దానికి అయిందా?
తన ఉనికే కిందికి మార్చిందా;
చక్కని గోదావరి ఒడ్డున
చల్లని గాలికి చేరిందా?
మేఘం కాదది, కాదది మేఘం,
గోదావరి ఒడ్డున రెల్లు
గొప్పగా, తెల్లగా పూచింది
అదిగో రెల్లు! అదిగో పూత!

# చలికాలం ప్రారంభం

ఆకాశమంతట అలమెను మబ్బు
తోటల్లో పొగమంచు దూరి ఉన్నాది
పక్షులు పాడక మందంగా ఉన్నై
చల్లని చిరుగాలి మెల్లగా నడిచె
మెదలక నిలుచుండె పెద పెద్ద చెట్లు
పచ్చని చేలు మందకొడిగా ఉన్నై
ఎక్కడ చూసినా నిశ్శబ్దం
పల్చనౌ వెలుగు, మందమౌ జీవం.

## గా లి క ల చో ట నే

గాలి కల చోటనే
కలువ పిట్టలు ఎన్నో

గాలి కల చోటనే
కలువ మొక్కలు చాలా

గాలి కల చోటనే
ఆల మందలు మేయు

గాలి కల చోటనే
ఆల కాపరి పాడు

గాలి కల చోటికే
కదలి పోదము రండు.

## పులి

అడవులలో నాట్యమాడే మృత్యువా !
సడీ సన్నా లేక పైబడి మింగే శత్రువా ! 2
అడవులలో గడ్డి దట్టంగా పెరిగినా
కడుపునిండా గడ్డికఱు సెప్పుడైనా ఎరుగునా ! 4
వాగులలో నీళ్లు బలబలని పారినా
దగ చెందిన లేడి కంఠాన్ని ఇన్ని జారెనా ! 6
అడవుల పాలిటి రాక్షసి రాజా !
తడవుల నుండి ఏలే యమధర్మరాజా ! 8
చీకటిలో తిరుగులాడే జీవమా !
మా కెంతో భయం, నీకు దయ ఉంటే
కావుమా ! 10

ఇంపు గుడిలో దేవుడి కంటే

గోపురం లోంచి చిలక రావడం
ఇంపు గుడిలో దేవుడి కంటే 2

గాలికి స్తంభం గంటలు ఆడడం
ఇంపు గుడిలో దేవుడి కంటే ! 4

కోనేటిలో తెలి నీరు కదలడం
ఇంపు గుడిలో దేవుడి కంటే 6

గుడిపై మలచిన బొమ్మలు చూడడం
ఇంపు గుడిలో దేవుడి కంటే 8

సాయంత్రం

పడమట ఎర్రని సూర్యుడు,
పచ్చని గట్ల మధ్య
పారే ఎర్రటి నీళ్లు.
చిట్టీత చెట్టాకులు
నీటిని తాగుతున్నాయి,
మెల్లని గాలికి ఆకులు
ఊగుతున్నాయి.
పక్కని మామిడి చెట్టుపై
పచ్చని ఆకుల నడుమ
పాడే నల్లని కోకిల
పరమానంద దాయకం.

# శ్రీ వేకుమళ్ల కామేశ్వరరావు గారు రచించిన కృతులు

| | |
|---|---|
| పాతపాటలు | (ప్రతులు లేవు) |
| కలువలు | |
| (చక్కని ఖండకావ్య సంపుటి) | 0—4—0 |
| గోపదారి మొగుడు | |
| (ప్రశస్తమైన సాంఘిక వచన నాటకం) | 0—8—0 |
| జానకిప్రేమ మొదలైన చిన్న కథలు | |
| (మొదటి శ్రేణికి చెందిన చిన్నకథల సంపుటి) | 0—8—0 |
| వాడుక భాష : | |
| రచనకి కొన్ని నియమములు | |
| (ఇంతకి ముందిట్టి గ్రంథం వెలువడలేదు) | 0—8—0 |
| పాలపిట్ట (బాల బాలికలకు పాటలు) | 0—2—0 |
| మిణుగురు పురుగు | 0—2—0 |

ప్రాప్తిస్థానం :

వేకుమళ్ల విశ్వనాథం, ఎం. ఏ. (ఆనర్సు)

పిఠాపురం,

తూర్పు గోదావరిజిల్లా.